

తిరుమల తిరుపతి దేవస్థానములు

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక

జనవరి 2016. వెల రూ.5/-

## వినరోభాగ్యము విష్ణుకథ













భారతదేశరాజధాని న్యూఢిల్లీమహానగరంలో
30.10.2015 నుండి 08.11.2015 వరకు జరిగిన వైభవోత్సవ దృశ్యచయనిక

# సప్తగిరి

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

సంపుటి 46 | జనవరి 2016 | సంచిక 8

వేంకటాద్రిసమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశసమో దేవో
న భూతో న భవిష్యతి ॥



సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-

## విషయసూచిక



ముఖచిత్రం : వినరోభాగ్యము విష్ణుకథ!
వెనుకచిత్రం : గోదాశ్రీరంగనాథుల కల్యాణం



# అచ్చతెలుగు పండుగ

భారతీయుల కాలగణనంలో చాంద్రమానంరీత్యా ఉత్తరాయణం ప్రారంభమయ్యే పుణ్యదినం మకర సంక్రాంతి. సూర్యునిగమనంలో – ఈ ఉత్తరాయణకాలంలో దేవతలకూ, పితృదేవతలకూ, దేవతా ప్రతిష్ఠాది శుభకార్యాలకు ప్రశస్తమైన కాలం. ఈ మాసమే రైతులకు పంట చేతికి వచ్చి, ఇండ్లల్లో ధాన్యం పుష్కలంగా ఉండి, వారు ఆనందించే సంతోషకాలం. ఈ పండుగ శ్రీనాథునికాలానికే 'పెద్ద పండుగ' అనే పేరుతో రూఢి అయ్యింది. సంక్రాంతికి ముందురోజు భోగి, సంక్రాంతి తర్వాతిరోజు కనుమ.... ఇలా మూన్నాళ్ల పండుగ ఇది. భోగిపండుగ పెద్దలకు, పిన్నలకు భౌతికంగా ఆనందాన్ని పంచిపెట్టే పండుగ. సంక్రాంతి పితృదేవతలకు సంతృప్తి కలిగించే పండుగ. కనుమపండుగ రైతులకు వ్యవసాయంలో అహర్నిశలు తమవంతు కృషిని అందించిన పశువులకు జరిపే పండుగ. ఇలా ఈ మూన్నాళ్లు భౌతికంగా, ధార్మికంగా కృతజ్ఞతాసూచకంగా అందరూ చేసుకొని ఆనందించే పండుగలు.

విశేషించి దేశానికి జీవనాడి రైతు. పల్లెలు బాగుండి, రైతులు వ్యవసాయంలో తగిన ఫలాలు పొందుతుంటేనే దేశం ఆహారసమస్యలేకుండా, కరవుకాటకాలు లేకుండా సుఖంగా జీవిస్తుంది. ప్రజల్లో దానధర్మత్యాగబుద్ధులు వికసిస్తాయి. ప్రకృతి పులకరిస్తుంది. కనుక సంక్రాంతి రైతులకు ఆనందం కలిగించే విశిష్టపర్వదినం. గృహస్థుడైన రైతు తాను పండించిన ధాన్యాన్ని మొట్టమొదటగా తమ ఇంటిదేవతకు, గ్రామ దేవతలకు నైవేద్యరూపంగా సమర్పిస్తాడు. ఆ తర్వాత తన సమాజజీవన వ్యక్తులలో బీదలకు దానధర్మాలు చేసి భగవత్ కృపకు, పుణ్యసంపదకు పాత్రుడౌతాడు.

సంక్రాంతి పండుగ ప్రకృతిలో పుణ్యసంపాదనకై మానవజాతిని ప్రేరేపించే పండుగ. పంచభూతాలను పూజించమని తెలిపే పండుగ. అందరిమేలు కోరే పండుగ. పంటల ద్వారా, దానధర్మాల ద్వారా మానవుడు పుణ్యసంపాదనతో ఇహపరాలు సాధించడానికి ప్రముఖసాధనం సంక్రాంతి పండుగ.

భోగిపండుగ రోజున తిరుమల శ్రీవారి సన్నిధిలో పెద్దశాత్తుమొఱ నిర్వహిస్తారు. కనుమపండుగనాడు గోదాదేవి పరిణయోత్సవమనే ప్రత్యేక కార్యక్రమం జరుగుతుంది. గోదాదేవి శ్రీరంగనాథునితో పారమార్థిక భోగాన్ని అనుభవించి, ఆ స్వామిలో లీనమైనరోజు భోగి. ఆ తల్లి భగవంతునితో ఐక్యభోగం పొందినందున ఆ రోజుకు భోగి అనేపేరువచ్చింది. ఇలా సంక్రాంతి పూర్వాపరాలలో భోగి, కనుమలను చేర్చుకొని త్రివిధగుణాలనూ తనలో లయం చేసుకొని, మానవునిత్రికరణాలకు శుద్ధి కలిగించి, త్రిమూర్తుల ఆరాధనతో పెద్దపండుగగా వాసికెక్కింది.

దశావతారాలు మానవజీవనక్రమవికాసానికి సంకేతం. అందులో బలరాముడు స్వయంగా గోపాలుడై సంతోషించడమేగాక వ్యవసాయసాధనమైన నాగలిని, వంటఇంట ప్రముఖసాధనమైన రోకలిని ఆయుధాలుగా కలిగినవాడై తనను దర్శించినంతనే రైతులకు ఉన్నతస్ఫూర్తి ప్రదాతగా గోచరిస్తాడు. బలరామునిచేతిలోని నాగలి రైతుజీవనానికి చిహ్నం. ఇలా భగవంతుడే స్వయంగా రైతురూపాన్ని ధరించి, దేశాన్ని సస్యశ్యామలం చేయడంలో రైతుదే ప్రముఖపాత్ర అని నిరూపించాడు. బలరాముడు సాక్షాత్ ఆదిశేషుడు గనుక శేషపర్వతంపై నున్న కలియుగప్రత్యక్షదైవం శ్రీవేంకటేశ్వరుడు తన దివ్యమహిమతో, బలరామావతారస్ఫూర్తితో లోకశ్రేయస్సు చేకూరుస్తాడని శ్రీవారిని ప్రార్థిద్దాం.



**సంక్రాంతి అంటే జాతి సంస్కృతికి సంతకంలాంటి పండుగ!**
**పెద్దల పండుగ... పంటల పండుగ... పశువుల పండుగ... మూడూ కలసి సంక్రాంతిపండుగ!**
**కుటుంబం మొత్తానికి అంటే - పెద్దా-చిన్నా, ఆడా-మగా, పిల్లా-మేక, పక్షీ-పశువూ...**
**సమస్త మానవ పరివారానికీ సంబంధించిన పండుగ.**
**శ్రీనాథ కవి సార్వభౌముడిచే 'పెద్దపండుగ' అనిపించుకున్న పండుగ - సంక్రాంతి!**

గ్రహగతుల్లోవచ్చే మార్పులకు సంక్రాంతి పండుగ ఒక సంకేతం. సూర్యుడు ఒక రాశిలోంచి మరోరాశికి మారడాన్ని సంక్రాంతిగా పిలుస్తారు. ఈ మార్పు ఏడాది పొడుగునా జరిగేదే అయినా, సూర్యభగవానుడు మకరరాశిలోకి ప్రవేశించడం – అన్నింటి కన్నా ప్రత్యేకమైనది! కనుక, మకరసంక్రమణాన్నే మనం సంక్రాంతిగా సంభావిస్తున్నాం. దక్షిణాయనం పూర్తయి, ఉత్తరాయణ పుణ్యకాలం ఆరంభం కావడం మరో ముఖ్యమైన కారణం. సంక్రాంతి అనేకాదు, ప్రతి పండుగను మన పెద్దలు సాంస్కృతిక ప్రతీకలుగానే రూపొందించారు. పండుగల పేరుతో వారు నిర్దేశించిన ఆచారవ్యవహారాలను గమనిస్తే – మన పెద్దల ఆలోచనల్లోని వైశాల్యం మనకు అర్థమవుతుంది. ప్రాణికోటి అంటే మనుషులొక్కరే కాదనేది భారతీయమైన ఆలోచన. జంతువులు, వృక్షాలు వగైరా సమస్త జీవజాలమంతా కలిస్తే– అది ప్రాణికోటి. కనుక మన ఆచారాల్లో, సంప్రదాయాల్లో అన్నింటా వాటికీ చోటుంటుంది. పక్షులూ, పశువులూసైతం మానవపరివారంలో భాగం అని మన పెద్దలతీర్పు. జీవావరణం, పర్యావరణం మన ఆచారాల్లో అంతర్భాగాలు. సంక్రాంతి పండుగ ఈ భావనలన్నింటికీ బలమైన ఆలంబన! కనుకనే దీన్ని మన జాతిసంస్కృతికి చేవ్రాలుగా చెప్పుకోవచ్చు.

సంక్రాంతి అనేసరికి అనుభవజ్ఞులందరిహృదయాల్లో సప్తవర్ణ రంజిత స్వప్నలిపి ఆవిష్కారం అవుతుంది. దట్టమైన మంచుతెరలు, చలిపొద్దులు, గంగిరెద్దులు, భోగిమంటలు, తలంట్లు, పిండి వంటలు, కొత్తపంటలు, చిలిపిజంటలు – వరివలపుపంటలు, కొత్త బట్టలు, హరిదాసులు, గొబ్బెమ్మలు, బంతిపూలు, జడగంటలు, పట్టుపావడాలు, భోగిపండ్లు, పాశురపఠనాలు, రథంముగ్గులు,

# ముచ్చటైన మూడురోజుల పండుగ
# సంక్రాంతి

– ఎర్రాప్రగడ రామకృష్ణ









ప్రాణాలకు తెగించి పోరాడే కోడిపుంజుల పౌరుషప్రతాపాల్లోని ఎర్రని వెలుగే సంక్రాంతిగా తోస్తుంది. బాదం పిస్తాలతో తమను ఇంతకాలంగా బలిష్టంగా మేపుతున్నది – తమమీది ప్రేమతో కాదనీ, గెలుపుమీద కసితోననీ గ్రహించలేని మూగజీవాలు తమ యజమానిపరువుకోసం రక్తం ఓడుతాయి. ఆ ఎర్రని మెరుపునే సంక్రాంతిసూర్యుడి అస్తమయకాంతికి ప్రతీకగా చెబుతారు – కొందరు సాత్త్వికభావుకులు. ఏదిఏమైనా ఎంతోకాలంగా ఇవన్నీ మనసంస్కృతిలో భాగమవుతూ వచ్చాయి.

సంక్రాంతి ప్రధానంగా మూడురోజుల పండుగ – అని మనం ఎరిగిందే! మొదటిరోజు భోగి. రెండోరోజు సంక్రాంతి. మూడోరోజు కనుమపండుగ. ధనుర్మాసవ్రతాన్ని నిష్ఠగా ఆచరించి, భూదేవిఅంశతో జన్మించిన గోదాదేవి– శ్రీరంగనాథుణ్ణి వివాహమాడి, సకలభోగాలను చేజిక్కించుకున్నరోజు కాబట్టి, ఆనాడు భోగిపండుగ అయింది. పాతసామాన్లు, చీపుర్లు, ఎండుకొమ్మలు, ధ్వంసమైన సామాన్లు వగైరా దారిద్ర్యచిహ్నాలన్నింటినీ పెద్దమంటలో వేసి తగులబెట్టడం ఆనాటి ఆచారం. వాటినే భోగిమంటలంటారు. దక్షిణాయనంలో సహజంగా వంటబట్టే బద్ధకమూ ఒకరకంగా దరిద్రచిహ్నమే! దీన్ని వదుల్చుకోవాలనేది దీని ఆంతర్యం. ఉత్తరాయణానికి సమధికోత్సాహంతో స్వాగతం పల్కి, శారీరకంగాను, మానసికంగానూ తిరిగి సరికొత్తగా జీవితాన్ని చురుగ్గా ప్రారంభించమని దానిఅర్థం.

నిండు గాదులను చూసి సంతోషించిన వ్యవసాయదారులు తమ ఇంటిముంగిట, అలాగే దేవాలయమంటపాలలోను వడ్లకంకుల్ని కుచ్చులుకుచ్చులుగా కట్టి వేలాడదీస్తారు. వడ్లకిరీటాల్లా ఉంటాయవి. పిచుకలకు, పిట్టలకు స్వాగతతోరణాలవి. మందలుమందలుగా చేరిన వాటిఅరుపులతో సందడితో ఆ యిల్లు చిలుకలు వాలిన చెట్టయిపోతుంది. సందడిగా ఉంటేనే పండుగ! ఉసూరుమంటూ, నిశ్శబ్దంగా ఉండే కొంపకు సంక్రాంతిశోభ రమ్మన్నా రాదు. వాకిట్లో ముగ్గులు – గోడకు పూసిన కొత్తసున్నాలు, గడపకు పూసిన పసుపు పరిమళాలు కలగలసిపోయి ఇల్లంతా వింతసువాసన అలుముకుందంటే పెద్దపండుగ వచ్చేసిందని గుర్తు.

చిరతలు వాయిస్తూ, తంబురమీటుతూ 'హరిలోరంగహరి' అంటూ మేలుకొలుపులు పాడుకుంటూ హరిదాసులు చేసే హడావుడి... శంఖంపూరిస్తూ 'శంభో' అని పెద్ద ధ్వనితో వేంచేసే జంగందేవరలు... 'అంబ పలుకు జగదంబ పలుకు' అని లయబద్ధంగా చిందులువేసే బుడబుక్కలువాళ్ళు... "అయ్యగారికి దండంపెట్టు – అమ్మగారికి దండంపెట్టు" అంటూ రకరకాల విన్యాసాలు చేయించే గంగిరెద్దులవాళ్ళు... సోదెమ్మలు... ఎక్కడెక్కడినుండో వచ్చేసి వీథులను శోభాయమానం చేస్తారు. లేదనకుండా గృహస్థులు వారందరినీ యథాశక్తి సంతోషపెడతారు. సంపదను పెంచుకుందామని కాకుండా, పంచుకుందామన్న ఆలోచనను రేకెత్తించే మంచిపండుగ సంక్రాంతి. పల్లెల్లో సమైక్య జీవనసౌందర్యశోభకు సంక్రాంతి సముచితప్రేరణ.

కోడిపందాలు, కనుమతీర్థాలు, బొమ్మల కొలువులు... ఇంకా ఎన్నో కలిసి సంక్రాంతి! కలిస్తేనే సంక్రాంతి! నిజంగానే ఇది చాలా పెద్దపండుగ. ఆ పండుగ వికాసాన్ని మనం రైతన్నల కన్నులలో స్పష్టంగా గమనించవచ్చు. ఆరుగాలం శ్రమించిన కర్షకుల స్వేదానికి ఫలితంగా పంటకళ్లాలలో నిండు దిగుబడి కళకళలాడుతుంటే కళ్ళారా గమనిస్తున్న రైతన్న కళ్ళతడిలో తళుకులీనే వెలుగుపేరే – సంక్రాంతి! భూమితల్లిపట్ల వరి గుండెల్లోంచి ఉబికివస్తున్న కృతజ్ఞతకు ఆ వెలుగే తీపిగుర్తు! "నా పుట్టింటివారు ఇంతవారు – అంతవారు అంటూ తెగ ఊరిస్తున్నావు. పద! ఎంతవారో చూద్దాం" అంటూ కొత్తభార్యను వెంటపెట్టుకొని, అల్లుడు అత్తవారింటికి రాగా, ఆయనకు దక్కుతున్న గౌరవమర్యాదలకు – హమ్మయ్యా! అనుకుని ఆడపడుచులు మురిసిపోతారు. ఆ మురిపెం మొగుడి చిలిపిచేష్టలకు దోహదకారి అవుతుంది. ఆ పడుచులు సిగ్గుతో మెలికలు తిరుగుతారు. అప్పు డాముగ్ధల చెంపల కెంపుల వెలుగులు చూస్తే సంక్రాంతి అంటే ఇదికదా! అనిపిస్తుంది.

మరికొందరికి... ఇటీవలికాలంలో చాలామందికి... సంక్రాంతి అనేసరికి కోడి పందాలు గుర్తొస్తాయి. అలాంటివారిదృష్టిలో

భోగినాటి ఆకర్షణల్లో గొబ్బెమ్మల పూజ ప్రధానమైంది. ఆవుపేడతో గొబ్బెమ్మలుచేసి, చుట్టూ రంగవల్లులు తీర్చిదిద్ది, వాటిని గుమ్మడిపూలతో అలంకరించి, కన్నెపిల్లలు "సుబ్బీ గొబ్బెమ్మా శుభము లివ్వవే" అని పాడుకుంటూ ప్రదక్షిణలు చేసే దృశ్యం హృదయంగమం. పట్టుపరికిణీలు, వెండిమువ్వలు, కేరింతలు, గొబ్బెమ్మరూపంలో గౌరీదేవిఆరాధనలు అందులోని విశేషాలు. భోగిరోజున ఇంద్రుడికి పొంగలి నైవేద్యం పెట్టడం ఆనవాయితీ. దాన్ని 'ఇంద్రపొంగలి' అంటారు. రాబోయే వేసవితీవ్రతను తగ్గించమని, తొందరగా తొలకరిని అనుగ్రహించమని ఇంద్రుణ్ణి అభ్యర్థించడం ఇందలి విశేషం. ఆ రోజు పసిపిల్లలకు భోగిపండ్లుపోసి, ముత్తయిదువులకు వాయినాలు ఇవ్వడం ఒక సంబరం.

రెండోరోజు సంక్రాంతి పెద్దలపండుగ. పెద్దలను స్మరిస్తూ దానధర్మాదులు నిర్వహించడం, ఆరోగ్యసిద్ధికై సూర్యుణ్ణి ఆరాధించడం సంక్రాంతినాటివిధులు. తిలాదానం ఈరోజు విశేషఫలితాన్ని ఇస్తుందని వ్రతగ్రంథాలు చెబుతున్నాయి. మినుములు, గుమ్మడిపండువంటివికూడా సంక్రాంతినాడు దానంచేసే ఆచారం ఉందిగాని, మకరరాశికి శని అధిపతి కనుక తిలాదానమే ప్రసిద్ధికెక్కింది. సాయంత్రం అయ్యేసరికి బొమ్మల కొలువులు సందడి చేస్తాయి. వివిధప్రాంతాల మట్టిబొమ్మలు మొదలు - మైసూరు చందనపుబొమ్మలుదాకా వివిధాకృతులు కొలువుతీరి, కన్నులపండువ చేస్తాయి. పౌష్యలక్ష్మికి స్వాగతాలు పలుకుతాయి.

మూడోరోజు కనుమ - ప్రత్యేకంగా పశువులకోసం కేటాయించిన పండుగ. పశువుల్ని పరిశుభ్రంగా కడగడం, కొమ్ములకు రంగులు పూయడం, కొత్తగంటలు మువ్వల పట్టెడలతో అలంకరించడం కనుమనాటివేడుక. పశువులంటే మనకు సంపదలో భాగం. కనుకనే పశుసంపదను 'సొమ్ములు' అనడంకూడా ఉంది. ఎడ్లను, గోవులను ప్రశంసించడం, పూజించడం, వాటికి పులగం తినిపించడం, ప్రేమతో వాటిని సాకడం కనుమనాటిఆచారం. వాటికి నైవేద్యం పెట్టిన పొంగలిని పసుపునీళ్ళతో కలిపి, పొలాల్లో చల్లుతారు. పంటలు బాగా పండాలనే కోరికతో చేసే ఆ కార్యక్రమాన్నే 'పొలిచల్లడం' అంటారు. కోడిపందాలు, ఎడ్లపోటీలు, పొట్టేళ్ళ పోరాటాలు కనుమనాటిసంబరాలు.

ప్రతిపండక్కీ ఒక్కో ప్రత్యేకదేవతను ఆరాధించడం తెలుగునాట ఆచారం. సంక్రాంతికీ ఒక అధిష్ఠాన దేవత ఉంది. అయితే ఆవిడ పేరు - ఆ వారంపేరుతో ముడిపడి ఉంటుంది. సంక్రాంతి ఆదివారం వస్తే ఆ దేవతపేరు - ఘోర!, సోమవారం అయితే - ధ్వాంక్షి!, మంగళవారంనాడు - మహోదరి, బుధవారం అయితే మందాకిని, గురువారంనాటి దేవతపేరు - మంద!, శుక్రవారమైతే 'మిశ్ర' అని, శనివారం సంక్రాంతివస్తే అధిష్ఠానదేవత పేరు 'రాక్షసి' అని చెబుతారు. అంటే సంక్రాంతిదేవత ఏడుపేర్లతో పిలువబడుతోంది. సంక్రాంతి ఏ రోజయితే ఆ పేరుతో వ్యవహరించాలి.



సంక్రాంతిగురించి చెప్పవలసిందింకా ఎంతో ఉంది. అసలు సంక్రాంతినే సంవత్సరాదిగా భావించాలనే వాదనకూడా వినబడుతూంది.

జ్యోతిషశాస్త్రరీత్యా నక్షత్రమండలం మృగఆకారంలో ఉంది కనుక, శిరస్సుస్థానం. మృగశిరానక్షత్రంలోకి సూర్యుడు ప్రవేశించడమే సంవత్సరానికి ఆరంభదినంగా పరిగణించాలనేది ఆవాదనలో ముఖ్యమైన అంశం.

కవులకు, కళాకారులకు, అన్నివయసులవారికీ, ఆఖరుకు పశుపక్ష్యాదులకుసైతం అనువర్తించే పెద్దపండుగ - సంక్రాంతి!




దిగ్దక్షిణాపి పరిపక్త్రిమ పుణ్యలభ్యాత్ -
సర్వోత్తరా భవతి దేవి తవావతారాత్ ।
యత్రైవ రంగపతినా బహుమానపూర్వం -
నిద్రాళునాపి నియతం నిహితాః కటాక్షాః ॥

– వేదాంతదేశికుల గోదాస్తుతిః (శ్లో. 11)

అమ్మా! గోదాదేవీ! దక్షిణ భారతదేశం చేసుకొన్న పరిపక్వమైన పుణ్యఫలంవలన, నీవు అవతరించిన దిక్కు దక్షిణమైనప్పటికీ, అది అన్నిదిక్కులకంటే శ్రేష్ఠమై విరాజిల్లింది. శ్రీరంగదివ్యదేశంలో శయనించిన రంగనాథుడు యోగనిద్రలో ఉన్నప్పటికీ, తన హృదయ ముప్పొంగగా కటాక్షవీక్షణాలను దక్షిణదిశపై ప్రసరింపజేశాడు.

శ్రీరంగనాథస్వామి వెలసి ఉన్న శ్రీరంగానికి సమీపంలోనే శ్రీవిల్లిపుత్తూరు అనే శ్రీవైష్ణవదివ్యదేశముంది. శ్రీవిల్లిపుత్తూరుకే 'ధన్వినపురం' అని సంస్కృతనామధేయం. ఆ క్షేత్రంలోని స్వామి పేరు వటపత్రశాయిపెరుమాళ్. (మఱ్ఱి ఆకుపై పవ్వళించిన పసిబిడ్డ) పాలులేని ఈ పసిబిడ్డ ఒంటరిగా మఱ్ఱాకుపై తెప్పలాగా నీటిపై తేలుతూ ఉన్నాడు. ఇది సృష్టి ప్రారంభంకానప్పటి పరిస్థితి. "తొల్లియును మఱ్ఱాకు తొట్టెలనె యూగె గన చెల్లుబడి నూగీని శ్రీరంగ శిశువు" అని తాళ్లపాక అన్నమయ్య, శ్రీరంగనాథుని 'శ్రీరంగ శిశువు' అన్నాడు.

కరారవిందేన పదారవిందం- ముఖారవిందే వినివేశయంతమ్ ।
వటస్య పత్రస్య పుటే శయానం- బాలం ముకుందం మనసా స్మరామి ॥

అని వటపత్రశాయి పెరుమాళ్ల ధ్యానశ్లోకాన్ని లీలాశుకులు శ్రీకృష్ణకర్ణామృతంలో మన కందించారు.

'ధన్వినపురం'లో పుట్టిన గోదాదేవి "ధనుర్మాసవ్రతాన్ని" అనుష్ఠించింది. ఈ 'ధనుర్మాసంలో' యోగనిద్రలో ఉన్న స్వామి మేల్కొని, భక్తుల విన్నపాలు వింటాడని పురాణాలు చెబుతున్నాయి. 'ఆషాఢశుద్ధఏకాదశి' నాడు శ్రీమహావిష్ణువు యోగనిద్రలోనికి జారుకొంటాడు. తిరిగి కార్తిక శుద్ధ ఏకాదశినాడు మేలుకొంటాడు. నిద్రలోనికి వెళ్లే ఏకాదశిని 'శయన ఏకాదశి' అనీ, మేల్కొనే ఏకాదశిని 'ఉత్థాన ఏకాదశి' అని వ్యవహరిస్తారు. ఈ నాలుగు మాసాలకాలం సన్యాసాశ్రమవాసులు 'చాతుర్మాస్య' దీక్షలో ఉంటారు. పురాణకథనం కంటే ముందే శ్రుతి దేవతలు వటపత్రశాయి పెరుమాళ్లకు 'మేలుకొలుపులు' పాడివున్నారు.

*(సంస్కృత భాగవతం స్కం. 10 ఉత్తర. అధ్యా. 87 శ్లోకాలు 1-50)*

జలప్రళయకాలం అంతమైన తర్వాత **ఆ విరాట్పురుషుని నిట్టూర్పు నుండి పుట్టిన వేదాధిష్ఠానదేవతలు (శ్రుతిదేవతలు) ఆ పరమాత్ముని ప్రతిపాదించే వాక్యాలతో - యోగనిద్రలో మునిగి ఉన్న ఆదినారాయణుని మేల్కొల్పులు పాడారు.**

"ఎల్లప్పుడూ అజేయుడవైన ఓ స్వామీ! నీవు సర్వోత్కృష్టుడవయ్యా! నీకు సర్వదా జయమగుగాక! స్థావరజంగమాలైన ప్రాణులు మునిగి ఉన్న అనాదిమాయను నశింపజేయవయ్యా!" **"అనాది మాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే"** అని ఉపనిషత్తులు చెప్పాయి. ఏది మొదలో తెలియని మాయచే జీవకోటి సర్వమూ నిద్రలో మునిగిపోతున్నది. ఆ జీవులు మేల్కోవాలంటే నీ అనాదిమాయను నీవు తొలగించాలి.

భౌతికంగా కళ్లుతెరిచి చూడడంకాదు - మేల్కొవడమంటే! భగవంతునికి సంబంధించిన ఆధ్యాత్మికజ్ఞానంలో మేల్కొవడమే నిజంగా మేల్కోవడం, ఆ రోజే అసలైన సుప్రభాతం! మంచిరోజు! ఆ శుభదినంకోసమే ఏదో తెలియని ఆరాటాన్ని లోలోపల మూగ



వేదనగా అనుభవిస్తున్నారు - జీవులు. తమను తాము మేల్కొల్పుకోవడమే సుప్రభాతరహస్యం! తమయొక్క ఉనికిని స్వామికి విన్నవించుకోవడమే సుప్రభాతస్తోత్రంయొక్క ఆంతర్యం!

సృష్టికి ఆదిలోనే సుప్రభాతతత్త్వాన్ని భాగవత **'శ్రుతిగీతలు'** ఆవిష్కరించాయి. ఈ తాత్త్వికసూత్రాన్ని తొట్టతొలిగా పట్టుకొన్న తొండరడిప్పొడి ఆళ్వార్ (క్రీ.శ.6వ శతాబ్ది) శ్రీరంగనాథునిపై పాడిన 'తిరుప్పళ్లి యెళుచ్చి' అనే పదిపాశురాలు, ప్రకృతిసౌందర్యమనే మాయను జయించిన జీవునిఆధ్యాత్మికఅనుభూతుల గానం!

**"పాలించి కరుణ చొప్పడ యోగనిద్రఁ జాలించి శ్రీరంగ శాయి మేల్కొనవె!"-** అనే ద్విపద, 'అరంగత్తమ్మా! పళ్లియెళుందరుళాయే!' అనే మకుటానికి అనువాదం. 'తిరుప్పళ్లి యెళుచ్చి'ని 33 ద్విపదల్లో తాళ్లపాక అన్నమాచార్యుల మనుమడు, చినతిరువేంగళనాథుడు (చిన్నన్న) పరమయోగివిలాసంలో చక్కగా అనువదించి ఉన్నారు.

తిరుప్పాణ్ ఆళ్వారుల (క్రీ.శ.7వ శతాబ్ది) 'అమలనాది పిరాన్' అనే పదిపాశురాలు శ్రీరంగనాథుని పాదాది కేశాంతస్తవం. పెరియాళ్వార్ అనబడే విష్ణుచిత్తులవారు (క్రీ.శ.750) గరుడవాహనారూఢుడై ఆకాశంలో సాక్షాత్కరించిన విష్ణుమూర్తికి తిరుప్పల్లాండు (జయఘోష) అనే మంగళాశాసనం పాడిన మహాభక్తశిఖామణి. ఈయన అడుగుజాడల్లో నడిచిన పెంపుడుకూతురు, ఆండాళ్ (గోదాదేవి) "తిరుప్పావై" అనబడే ఒక విలక్షణ విశిష్టవ్రతాన్ని అవలంబించింది. రోజుకు ఒక పాశురం చొప్పున పాడి,పాలకడలిపై శయనించిన విష్ణుమూర్తి మేల్కొనే ధనుర్మాసంలో, మోక్షసంపదను అనుగ్రహించే వ్రతం (తిరుప్పావై)గా అనుష్ఠించింది. తన విన్నపాలు విన్నవించి, స్వామిలో లీనమైపోయిన ఒక గొప్పభక్తయోగిని, విదుషీమణి, కారణజన్మురాలు, పదుగురు ఆళ్వారుల జ్ఞానపుత్రిక! జీవులకు మోక్షమార్గాన్ని అనుష్ఠించి చూపిన కరుణామయి గోదాదేవి!

### గోదాదేవి జీవితరేఖలు

**కర్కటే పూర్వఫల్గున్యాం తులసీ కాననోద్భవామ్ ।**
**పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకీమ్ ॥**

కలియుగంలో 98వ నలనామసంవత్సరం, కర్కాటక మాసం, శుక్లపక్షచవితి, పుబ్బానక్షత్రం, మంగళవారంనాడు శ్రీమహావిష్ణువుకు ప్రియమైన తులసీవనంలో సలక్షణయై, లోకవిలక్షణయై భూదేవియే గోదాదేవిగా అవతరించింది.

గోదాదేవి క్రీ.పూ.3005లో జన్మించిందని శ్రీవైష్ణవ సంప్రదాయం చెబుతుండగా, ఆధునిక పరిశోధకుల ప్రకారం ఆమె క్రీ.శ. 716లో జన్మించి, క్రీ.శ.732లో శ్రీరంగనాథునిలో లీనమైందని చెప్పారు. అంటే, 16 సంవత్సరాలు మాత్రమే జీవించిందనీ, 15వ యేటనే తిరుప్పావై అనే 30 పాశురాలను పాడి వ్రత సమాప్తి చేసిన తర్వాతకూడా స్వామి సాక్షాత్కరింపక పోవడంచేత, విరహవేదనతో కృశిస్తూ, దుఃఖిస్తూ పాడిన 143 పాశురాలే 'నాయ్చ్చియార్ తిరుమొళి'

**అంజుకుడిక్కొరు సందదియాయ్ ఆళ్వార్‌గళ్**
**తంజెయలై వింజినిర్కుం తన్మైయళాయ్**
**పింజాయ్ పళుత్తాళై ఆండాళై బత్తియుడన్**
**నాళుమ్ వళుత్తాయ్ మనమే మగిళ్‌న్దు ॥**

పంచపాండవులకు పరీక్షిత్తు ఒక్కడే బిడ్డయైనట్లు, పదుగురు ఆళ్వారులకు ఆండాళ్ ఒక్కతెయే జ్ఞానపుత్రికగా ప్రకాశించింది. ఆమె భక్తి ఎంతటి విలక్షణమైందంటే, ఒక చెట్టులో కాసిన పిందె-కాయగా మారి, దోరగా పండి పక్వమైనప్పుడే ఆస్వాదనీయమౌతుందికానీ- పిందెగా ఉండేటప్పుడే పరిపక్వమైనజ్ఞానాన్ని భక్తితో రంగరించుకొన్న జ్ఞానవృద్ధురాలయిందంటే ఓ మనసా! లోలోపల నీవు సంతోషించుమా!

పార్వతీదేవి చిన్నవయస్సులోనే కఠోరమైన పంచాగ్ని మధ్యంలో తపస్సు ఆచరించగా వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులైన ఋషులు ఆమె దగ్గరకు వచ్చి, నమస్కరించారని మహాకవి కాళిదాసు కుమార సంభవంలో కీర్తించాడు. గోదకూడ అలావంటిదే!

**"న ధర్మవృద్ధస్య వయ స్సమీక్ష్యతే"** అన్నాడు కాళిదాసు. ధర్మానుష్ఠానంలో ఉన్నతోన్నతస్థితులను అందుకొన్న వారికి వయస్సుతో నిమిత్తము లేదుకదా! అని దీని కర్థం. "మూర్తి చిన్నది, స్ఫూర్తి గొప్పది"గా ఆండాళ్‌తల్లి మహనీయమైన జ్ఞానసంపత్తికి ప్రమాణం అయ్యింది. లేత వయస్సులోనే భగవద్విభూతిని అనుభవించి, రమణీయమైన రెండుప్రబంధాలు చెప్పిన గోదాజీవితం అత్యంత విలక్షణమైంది.

శ్రీకృష్ణదేవరాయలు ఈమెను "ఆముక్తమాల్యద" అన్నారు. ఆ= తాను చక్కగా ధరించి (ఆసమన్తాత్), ముక్త= విడిచిన, మాల్య= పూమాలను, ద= ఇచ్చినది. తాను ధరించి విడిచిన పూమాలను తిరిగి స్వామికి సమర్పించింది. ఇటువంటి ఆముక్తమాల్యదా దివ్య జీవనసౌందర్య వైభవాన్ని, ఆధ్యాత్మికపరిమళాలను రంగరించి, మహాప్రౌఢప్రబంధంగా రాయలవారు తీర్చిదిద్దారు. **ఆమె ఒక ఆధ్యాత్మిక శృంగారమనే ధనుస్సునుండి విడువబడిన మన్మథబాణం! అందుకే గోదాదేవిభక్తితత్త్వం మధురభక్తి, శృంగారభక్తి'కి చెందింది.**

"పుమాన్ విష్ణురితి ఖ్యాతః, స్త్రీప్రాయం ఇతరంజగత్" అని భాగవత పురాణం చెప్పింది. "విష్ణువొక్కడే పురుషోత్తముడు. స్త్రీపురుష వివక్ష లేకుండా జీవులందరూ స్త్రీలే" అనే వైష్ణవ శృంగారభక్తియే మధుర భక్తి. గోదాదేవి ఈ మార్గంద్వారా స్వామిని చేరుకొన్నది. ఇందులో శ్రీకృష్ణుడే ఉపాయం. అతని శ్రీచరణ కైంకర్యమే ఉపేయం. దేవునికి, జీవునికి అవినాభావసంబంధం. ఇది అనాది. విడదీయడానికి వీలులేనిది జీవేశ్వరబంధం.

### పెరియాళ్వార్ గోదాదేవికి తండ్రిగా విష్ణువే నిర్ణయించాడు

భక్తులందరివలెనే తానుకూడ ఒక వ్రతంచేసి, వైకుంఠనాథుణ్ణి చేరుకోవాలనే కోర్కె స్వామికి విన్నవించగా–ఆయన పెరియాళ్వార్ల యింటిలో అవతరించమని, ఆయనయే నీకు తండ్రిగా, హితైషిగా మార్గదర్శనం చేస్తాడని చెప్పాడు–స్వామి. ఆ ప్రకారంగా తులసీ వనంలో లక్ష్మీదేవిగా పెరియాళ్వార్లకు లభించి, పెంపుడు కూతురైంది.

తండ్రిదగ్గర 108 దివ్యదేశాలలోని అర్చామూర్తుల కథలు విని విని, చివరికి శ్రీరంగనాథుణ్ణే పతిగా వరించింది. ఆ స్వామిని చేరుకొనేమార్గం చెప్పమని తండ్రిని కోరింది. ఈ విడ్డూరమైన కోర్కెను కాదనలేక విష్ణుచిత్తుడు ద్వాపరయుగంలో గోపికలు అనుష్ఠించిన కాత్యాయనీవ్రతాన్నిగురించి చెప్పాడు.

ఇది సంస్కృత భాగవతం – దశమస్కంధం – పూర్వభాగం– అధ్యాయం – 22లో 28 శ్లోకాలలో చెప్పబడింది. ద్వాపరయుగంలో వ్రేపల్లెలోని గోపికలు కాత్యాయనీవ్రతాన్ని అనుష్ఠించడంలో వారి మనసులోని కోరిక శ్రీకృష్ణుణ్ణి భర్తగా పొందాలనేదే!

హేమంతఋతువు, మార్గశీర్షమాసంలో నందుని గోకులం లోని కన్యలు కాత్యాయనీవ్రతాన్ని అనుష్ఠించారు. వారు గోధుమనూక బెల్లంతో కలిపి వండిన హవిస్సునుమాత్రమే భుజించేవారు. తెల్లవారు జామున యమునానదిలో స్నానంచేసి, ఏటి ఒడ్డున ఇసుకలో కాత్యాయనీదేవి ప్రతిమను చేసి పూజించారు.

> కాత్యాయని మహామాయే మహాయోగిన్యధీశ్వరి ।
> నందగోపసుతం దేవి పతిం మే కురు తే నమః ॥ (22-4)

'ఓ దేవీ! నీవు కల్యాణాలకు ఆధారస్థానమైనదానివి. మహామాయాస్వరూపిణివి. గొప్పయోగినివి. సర్వేశ్వరివి. నాకు నందగోపుని పుత్రుడైన శ్రీకృష్ణుణ్ణి భర్తగా అనుగ్రహించవమ్మా!' అనే మంత్రాన్ని జపం చేస్తూ గోపికలు నెలరోజులపాటు ఈ వ్రతాన్ని చేశారు. భద్రకాళిని పూజించి నందపుత్రుణ్ణి భర్తగా కోరుకొన్నారు. కృష్ణుడు ఆ వ్రతంలో సంక్రమించిన దోషాన్ని నివారించి, గోపికలను అనుగ్రహించాడు. 'కామోత్కంఠితలైన గోపికలకు శ్రీకృష్ణుడు వ్రతఫలసిద్ధి కల్గించాడు కాని, కలియుగంలో ఆ వ్రతమూ – తత్ఫలమూ ఎలా సాధ్యం?'

### కలియుగంలో కూడ అటువంటి వ్రతం సాధ్యమేనా?

'తిరుప్పావై' కు మూవాయిఅప్పడి వ్యాఖ్య వ్రాసిన వ్యాఖ్యాతృ చక్రవర్తి పెరియవాచ్చాన్ పిళ్లై, 'అవతారిక'లో ఇలా వ్రాశారు. "ఈ నోముకు ప్రమాణమేదంటే – మీమాంసాశాస్త్రంలో హోళాధికరణ పద్ధతిప్రకారంగా ఇది శిష్టాచారసిద్ధం. మేలైయార్ శెయ్వనగళ్ (తిరుప్పావై – 26వ పాశురం) పూర్వీకుల అనుష్ఠానాలని ఆండాళ్ స్వయంగా చెప్పి ఉంది.

ఇంకా, ప్రమాణం కావాలంటే– 'ధర్మజ్ఞ సమయః ప్రమాణం' 'ఆచారశ్చైవ సాధూనాం' (మనుస్మృతి) అనే ప్రమాణాలనుబట్టి ఇది శిష్టాచారసిద్ధం. ప్రమాణాలంతగా లేకపోయినా, శిష్టాచార సిద్ధమైనట్టి దాన్ని అనుష్ఠింపవలసిం దని మీమాంసాశాస్త్రంలోని హోళాధి కరణంలో నిర్ణయింపబడింది. హోళ అంటే వసంతోత్సవం, దీన్ని ఫాల్గుణబహుళపాడ్యమిరోజున ప్రతిసంవత్సరం అనుష్ఠిస్తారు.

### గోదాదేవి అనుష్ఠించిన 'తిరుప్పావై' లో ముఖ్యనియమం

గోదాదేవిని ఆమెతండ్రి 'భావనాసిద్ధి' ని పొందగల్గితే ద్వాపరయుగంలోని గోపికల కాత్యాయనీవ్రతసిద్ధి పొందగలవన్నాడు. ఆ విధంగానే గోదాదేవి కలియుగంలో ఉన్నప్పటికీ 'మనసా' తాను ద్వాపరయుగంనాటి గోపికగా 'భావాంతరీకరణం' పొంది, తనచుట్టూ ఉన్న వస్తుజాతమంతా వ్రేపల్లె నేపథ్యంగా సంతరించుకొనింది. యోగంలో 'ట్రాన్స్' అనే స్థితిలో ఉండిపోయింది. పర్యవసానంగా శ్రీరంగనాథునిలో లీనమైంది.

తిరుమలపై ప్రతియేటా ధనుర్మాసంలో సుప్రభాతానికి బదులుగా తిరుప్పావై పారాయణం చేస్తారు. బ్రహ్మోత్సవాలలో గరుడ సేవరోజు శ్రీవిల్లిపుత్తూరునుండి ఆండాళ్ పంపే పూలమాలను వరమాలగా స్వామికి అలంకరిస్తారు.

తిరుప్పావై పరమార్థం – ఓ సర్వేశ్వరా! నీకు శేషభూతమైన ఆత్మవస్తువు అనర్థంలో పడకుండా–దాని స్వరూపానికి అనుగుణమైన కైంకర్యాలను ప్రసాదించి, అవి ఆత్మ ఉన్నంతకాలం ఉండేట్లు కృప చేయాలి. ఇది ముముక్షువులైన భక్తుల మహాసంకల్పం! ఎల్లప్పుడూ స్వామికి ఇదే విన్నపం!

॥ ఓం శ్రీ ఆండాళ్ తిరువడిగళే శరణమ్ ॥ ●

# సిరినోము





**గో**దాదేవికే శ్రీ ఆండాళ్, చూడికొడుత్తనాచ్చియార్ అనే పేర్లున్నాయి. ఈమె రచించిన **'తిరుప్పావై'** పాశురాల్లో గోపికలు ధను ర్మాసవ్రతం ఆచరించుట ఒక్కొక్క రోజు ఒక్కొక్క పాశురం చొప్పన వర్ణింపబడింది. గోదాదేవి ఈ ధనుర్మాస వ్రతం ఆచరించే స్వామి అనుగ్రహాన్ని పొందిందని వైష్ణవ సంప్రదాయం.

లలిత సంగీత లయ విన్యాసాలతో గోదాదేవి కూర్చిన పాశురాలలో కన్పించే, విన్పించే శబ్ద లయ లాలిత్యాలను మించి మనోనేత్రానికి దర్శనం ఇచ్చే భక్తి ప్రేమల సౌరభమే ఈ పాశురాల హారాన్ని భగవంతుడికి స్వీకారయోగ్యం చేసింది. మామూలు దండలను ఆయన భరించాడు. ఆండాళ్ హారాన్ని ధరించాడు.

గోదాసతి - వటపత్రశయనుని సేవలో తన్ను తానుగా ఏమని ఊహించుకొని - ఏమని పల్లవించినదో- ఏ నోములు నోచినదో- ఆ మార్గళీ - వ్రత నిరతానుభూతియే ఈ తిరుప్పావై. కృష్ణదాసి గోదా మనస్సు ఎప్పుడూ మాధవ మందిరంలోనే. రమాధవుని హృదయ స్పందనంలోనే. అందుకే ఆమె కవిత ఒక్కొక్క పూవు, ఒక్కొక్క దీపం.

ఈ గోదాపాశురాలకు **బాపు** చిత్రాలు, భావ కవితా చక్రవర్తి **దేవులపల్లి కృష్ణశాస్త్రి** చేసిన గేయానువాదాలు సప్తగిరి పాఠకులకోసం...

సౌజన్యం
శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రుల
'రసధుని' (తిరుప్పావై భావానువాదం, 1999) గ్రంథానికి
బాపు వేసిన పాశురచిత్రాలివి. వారికి కృతజ్ఞతలు.





1

రారమ్మ ఓ అమ్మలారా! రారే మమ్మ!
నీరాడ మనసున్నవారు, మీరూ - మీరు!
శ్రీరమ్యమైన మన వ్రేపల్లెలోన
చేరి, కన్నియలార! కూరిమి చెలులార! ॥రారమ్మ॥

ఇది మార్గశిరము, వెన్నెలవేళ, భాసురము!
ఇది పరవాద్యవ్రతారంభ వాసరము!
మదిలోన జగమెల్ల ముదమంది పొగడ,
కదిసి కంకణ కటక కింకిణులు కదల ॥రారమ్మ॥

మరిమరీ కనికనీ మెరసేటి కనులతో
మురిసే యశోదమ్మ ముద్దు సింగపుకొదమ,
కరిమొయిలు మెయిహొయలు గల అందగాడు,
వరదుడౌ మనరేడు వ్రతమేలువాడు ॥రారమ్మ॥

కరమందు కరకువాల్ కాపుగా దాలిచి
వరలేటి మేటినందుని నందనుండు
అరుణశశిబింబనిభ శుభవదనుడు
సరసిజాక్షుడె నోము కరుణింపగా ॥రారమ్మ॥



సిరినోము







## 2

వినరమ్మ, వినరమ్మ, మననోము తీరు
పనిబూని చేసిన మన సిరులు మీరు!

అల పాలకడలి ఊయెల శేషశయ్యపై
అలవోక నిదురించు హరి శ్రీపదాబాల
తలచుకొనుచు, సారె కొలుచుకొనుచు,
తొలవేగుబోక నీరాడవలె చెలులార! ॥వినరమ్మ॥

వలదు క్రోలగ పాలు, వలదు త్రావగ నేయి!
వలదు కాటుకపూత మన కన్నుదోయి!
అలరులుకై సేయవలదు క్రొమ్ముడులలో!
లలనలారా! నోము నోచినదినాలలో! ॥వినరమ్మ॥

పరమాత్ముడౌ ప్రభువు సరస, పరులపై
దురుసుమాటలు నోట తొడుగరా దమ్మ!
దరియనీరాదు ఘనులొల్లని పనులను!
జరుపవలె ముదమున దానధర్మములను! ॥వినరమ్మ॥



# సిరినోము







3

ఎనలేని సిరులతో నిండును
ఈ సీమ
ఈతిబాధలు కలుగకుండును!

మునుకొని త్రివిక్రముని నామములు పాడి
మొనసి మా నోమునకు తాన మాడితిమేని ॥ఎనలేని॥

నెలనెలా మూడువానలు కురియును,
బలిసి ఏపుగ పైరు లెదుగును,
అల పైరుసందులను మీ లెగురును,
కలువల ఎలతేంట్లు కనుమూయును ॥ఎనలేని॥

కడగి కూర్చుండి పొంకంపు చన్నులను
ఒడిసి, పిదుకగ, పట్టి - రెండుచేతులను,
ఎడము లేకుండ పెను జడుల ధారలను
కడవల ఉదార గోక్షీరములు కురియును ॥ఎనలేని॥



సిరినోము







## 4

కురియుము కురియుము వర్షము!
వరలగ జగతికి హర్షము!
ఓయీ గంభీర హృదయ!
ఓహో వర్ష నిర్వాహ ॥కురియుము॥

మురిసి మార్గశిరస్నాన
మును మే మొనరుప తడయక ॥కురియుము॥

జలనిధిలో జొరబడి, అట సలిలమెల్ల త్రాగిత్రాగి,
ఫెళఫెళమని గర్జింపుచు, బిరబిర పై కెగసి ఎగసి,
అల కాలోపలక్షిత జగత్కారణుని మూరితి
వలె నీమెయి నీల నీలవర్ణముతో తేలతేల
॥కురియుము॥

సుందరపటుబాహువు అరవిందనాభు మేటికరము
పొందిన శ్రీ సుదర్శనము పొలుపున తళతళామెరసి,
క్రందుగ దక్షిణావర్తమగు శ్రీ పాంచజన్యమ్ము
చందమ్మున ఉరిమి, శార్ఙ్గమట్లు అంపజడులు చిమ్మి
॥కురియుము॥



సిరినోము



5

చెప్పరే! చెప్పరే! శ్రీ నామములను!
ఒప్పుల కుప్పలార! తప్పక! తప్పక!
ఎప్పుడో చేసిన తప్పులన్నీ నశింప
నిప్పులో తూలికలుగా! ఇప్పుడే! ఇప్పుడే! ॥చెప్పరే॥

అల్ల వ్రజవంశమ్మునకు కల్యాణదీపమ్మైనవాని,
తల్లికడుపున కెల్లవేళల చల్లనగు వెలుగైనవాని,
అల్లన, అమలినలుగా ఏతెంచి, ధ్యానించి, ధ్యానించి,
సల్లలిత సుమము లర్పించి, సేవించి, సేవించి
॥చెప్పరే॥

మాయవాని, ఉత్తర మధురాపురికి రేడైనవాని,
హాయిగా గంభీరయమునాతీరమున విహరించు వాని,
ఈయెడ, దామోదరుని ధ్యానించి, మరిమరి ధ్యానించి,
తీయని అచ్చంపు పువులర్పించి మరిమరి సేవించి
॥చెప్పరే॥

సిరినోము





## 6

తెలవారుచున్నదిగదే! లేవే! లేవవే!
కలకలా కూసేను పులుగులు - ఓ బాల!
అల గరుడవాహనుని గుడినుండి తెలిసంకు
అదిగదిగో పిలిచేను, లేవే! బాలలేవే! ॥తెల॥

ఓలి పెనువిసపు చనుబాలు పీల్చినవాని,
లీల మాయశకటము కాల కూల్చినవాని,
మేలుకొని, రుషులు యోగులు మనసున లోనగొని
మరిమరీ హరిహరీ యను మహాఘోషమ్ము
చొరబారి మా యెదలలో
చలచల్లనాయె గదవే... ॥తెల॥

పాలకడలిని పాపపానుపున యోగ ని
ద్రాళువగువాని కారణభూతుని
మేలుకొని రుషులు యోగులు మనసున లోనగొని
మరిమరీ హరిహరీ యను మహాఘోషమ్ము
చొరబారి మా యెదలలో
చలచల్లనాయె గదవే! ॥తెల॥



సిరినోము







## 7

వినలేదటే వెర్రి జవరాలా!
వినియె హాయిగ పవ్వళించేవటే!
తనితనిగ తెలవారెనని కీచుకీచుమని
మునుమునుగ ఏటిరింతలు మూగి పలికేను ॥వినలే॥

ఘల్లుమనగా కంఠసరులు కాసులపేర్లు,
జల్లగా కడల క్రొమ్ముడులు వాసనలు,
గొల్లయిల్లాండ్రు తరిగోలలను కైకొనుచు,
పెల్లుగా చల్ల తరిచే సవ్వడి ॥వినలే॥

హరిని నారాయణుని కైవారముల మేము
ఆలపించిన ఆలకించనే లేదటే!
దొరసాని వౌరౌర! ఓ బాల లేచి
తెరవవే వాకిలి ఓసి తేజోవతీ! ॥వినలే॥



సిరినోము







8

చానా! లేవే! చాలే పవళింపులు!
చానా! లేవే! చాలులే పవళింపులు!
ఔనే! చెలుల అచట ఆపి వచ్చేమే!
పూని నోము, స్నానమాడ వలచేదాన! ॥చానా॥

అల్లదే! చూడవే! తూరుపు
తెల్లవారెనె, ఎనుము కదుపులు
మెల్లగా తరలెనే, మంచున
తడియు పచ్చిక బీళ్ళ మేయగ! ॥చానా॥

చేరిచి వాద్యముల కైవారముల కావింప
కూరిమితో దేవదేవుడు కృపను మనపై చూపునే!
వారువము వలె వచ్చు రక్కసు
నోరు చీరినవాని వేడగ
క్రూర చాణూరాది మల్లుల
బీర మడచిన వాని పాడగ! ॥చానా॥



సిరినోము







**9**

మనవి వినవే! మామకూతుర!
మణికవాటము తీయవే!
మణిఖచిత సౌధమ్ములో పరి
మళపు దివ్వెల వెలుగులో
నును తలిమమున కనులు మొగిడిచి
కునుకుదువుగానీ! లేవే! ॥మనవి॥

మూకయో! చెవిటిదో! అత్తా!
ముద్దులా చిన్నారి కూతురు!
కాక కావలి కదలనీయరొ?
గాఢనిద్రా మంత్ర మేసిరొ? ॥మనవి॥

"శ్రీకరా! వైకుంఠ నాథా!
మాధవా! మాయావి! హరి"యని
నీ కుమార్తెను లేపుమా, శుభ
నామ పారాయణముతో! ॥మనవి॥



సిరినోము







**10**

పోనీ తలుపు తీకుంటే
మానేవు గానీ!
ఔనే! ఒక మాటైనా
మాతో అనవేమీ?

చానా! నోమూని స్వ
ర్గానూన భోగముల
ఆనందించేదాన!
మా తల్లి కాన! ॥పోనీ॥

నారాయణుడు కోమలామోద తులసీ
శ్రీరుచిరమౌళి మనపాలి వరదాయి!
గారాన మనకు పరవాద్యమ్ము కరుణించు!
నోరార చేయు కైవారముల ఆలించు! ॥పోనీ॥











## 11

రావే! గోపవంశాన రాజిల్లే లతకూన!
రావే! పాముపడగ బోలే కటికలదాన!

లేవే! నీరదశ్యామ మోహనుని నామముల
నీ వాకిటనే నిలిచి నీవారు పాడేరు! ॥రావే॥

మేలి పాదుగుల ఆలు వేలు కలవారు, ఆ
భీలరణమున అరుల బీర మడచేవారు, గో
పాలకుల కులమున వెలసే ఓ వనమయూరీ!
లేవే కలుములనెలవౌ ఓ నారి! ఒయ్యారి! ॥రావే॥



సిరినోము







## 12

ఏమి వింతలోగాని, చెలియరో! అయ్యయో!
నీ మదిని క్రమ్మినది ఏ మాయ నిదురో!

జామాయె నీయింటి మోసాలలో వేచి,
ఈ మంచులో గడప నానుకొని నిలిచి! ॥ఏమి॥

వైరియౌ లంకాధిపతిని తునుమాడిన
శౌరిపై, ఆ మనోహరిపై, మా పాట
ఊరివా రెల్లరును చెవులార విన్నారు!
ఔరౌర! ఇకనైన లేవమ్మ! మా అమ్మ! ॥ఏమి॥

తన లేగలను తలచికొని అరచి చేపుగొను
చనుమొనల, ఎనుము ఎడతెగక కురిసే పాల!
మునివాకిటను బందగానైన వీటిలో
ఎనలేని సంపదలు గలవాని చెల్లెలా! ॥ఏమి॥











## 13

లలితశయనా! చలిత
హరిణ నయనా! లెమ్మ!
తెలవారు చున్నదమ్మా!
అలరు కొమ్మా! తళుకు
పసిడిబొమ్మా! లెమ్మ!
తెలవారు చున్నదమ్మా! ॥లలిత॥

పులుగు లవె మేతలకు తరలేను -
మెలమెల్ల గురు డస్తమించేను -
అల శుక్రతార మింటను పొడిచెను!
కలసి మాతోరమ్మ! కపటమును విడవమ్మ ॥లలిత॥

బక దైత్య వైరి ఆ దశకంఠ సంహారి
అకలంక చరితముల ఒకచోట చేరి
ఈ పుణ్యదివసాన సకియలు పాడేరు
తీపారు వలినీట తీర్థమాడగదమ్మ!

తెలవారుచున్నదమ్మా!
లలితశయనా! హరిణనయనా!



సిరినోము







14

కలువ కనుమూసినది
కమలమ్ము పూచినది
కలికిరో! నీ పెరటి కొలనులో!

తెలిదంతముల జియ్యరులు, కావి తాలుపులు
తరలేరు, కుంచెకోలల తెరవ కోవెలలు! ॥కలువ॥

మిమ్ము నేనే వచ్చి మేలుకొలిపెద నని
అమ్మ చెల్లా! నీవు నిదురింతువే!
కమ్మగా నెరవాది మాటలన్నీ ఆడి
ఎమ్మెలాడీ! నీవు సిగ్గుపడవే! ॥కలువ॥

వరశంఖచక్రధారిని, హరిని, శౌరిని,
పురుషోత్తముని వికచజలజ లోచనుని
తరుణు లందరితోడ తనివారగా పొగడ
తరలిరావమ్మ! నిద్దురమాని, ఓ కొమ్మ! ॥కలువ॥



సిరినోము







## 15

"ఓ చిరుత రాచిలుక! లేచి రావేమే! వేచియున్నామే!"
"వేచేవారి నిదుర దోచుకున్నానో!
ఓ చెలులు! నా నిదుర దాచుకున్నానో లేచి వచ్చేనే!"

"భళిభళీ! సఖి! ఎంత నుడికారితనమే!
తెలుసులే నీ నంగనాచితనము మాకు!!"

"మీరు గడుసరులు కారేమొ పాపము!
నేనే కాబో లంత నేరవని దాన!
వచ్చిరో అందరును నెచ్చెలులు?"

"ఆ! వచ్చి నీవే లెక్క పెట్టుకోవే!
విచ్చేయవే, అమ్మ చెచ్చెర! లేకున్న
మచ్చిక పని యున్నదేమొ ఏదయిన!"   ॥ఓ చిరుత॥

"ఉరు మత్తగజకుంభ మురియ మొత్తినవాని,
అరుల దర్పమ్ము నరవర చేయువాని
అరిది గుణములవాని, హరిని కీర్తింప
అరుగగా వలయు బిరబిర రమ్మ! ఓ అమ్మ" ॥ఓ చిరుత॥



సిరినోము



## JANUARY 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

## FEBRUARY 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |
| 29 | | | | | | |

## MARCH 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | 31 | | | |



### JANUARY

1. New Years Day
14. Bhogi 15. Makara Sankranthi
16. Kanuma, Sri Godadevi Parinayotsavam
22. Tirupati Sri Kapileswara swami Chandanabhishekam
24. Sri Ramakrishna Theertha Mukkoti
26. Republic Day

### FEBRUARY

14. Rathasaptami
16 to 22. Tirupati Sri Govindaraja swami Float Festival
18. Bhishma Ekadasi
22. Kumaradhara Theertha Mukkoti
27. Srinivasa Mangapuram Sri Kalyana Venkateswara swami Brahmotsavam Begins
29. Tirupati Sri Kapileswara swami Brahmotsavam Begins

### MARCH

6. Srinivasa Mangapuram Sri Kalyana Venkateswara swami Brahmotsavam Ends
7. Maha Sivarathri
9. Tirupati Sri Kapileswara swami Brahmotsavam Ends, Suryagrahanam
19 to 23 Srivari Float Festival
23. Holi, Sri Lakshmi Jayanthi
23 to 27 Nagulapuram Sri Vedanarayana swami Surya Seva and Float Festival

## APRIL 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | |

## MAY 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| | | | | | | 1 |
| 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |
| 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 |
| 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 |
| 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 |
| 30 | 31 | | | | | |

## JUNE 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| | | 1 | 2 | 3 | 4 | 5 |
| 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 |
| 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 |
| 27 | 28 | 29 | 30 | | | |



### APRIL

4. Annamacharya Vardhanthi
4 to12. Sri KodandaRamaswami Brahmotsavam, Tirupati
8. Sri Durmukhinama Samvatsara UGADI
9. Matsya Jayanthi
14.Tamil New Years Day
15.Srirama Navami
19 to 21. SRIVARI Vasanthotsavam
22 to 30. Nagulapuram Sri VedaNarayana Swami Brahmotsavam

### MAY

9. Akshayatritiya, Parasurama Jayanthi, Simhachalam Chandanotsavam
10. Ramanuja Jayanthi, Tirupati Ganga Jathara Begins
11. Sankara Jayanthi
14 TO 22 Tirupati Sri Govindaraja swami Brahmotsavam (Sri G.T)
15 TO 17 Padmavati Srinivasula Parinayam(Tirumala)
19 to 27 Hrishikesh Sri Venkateswara swami Brahmotsavam, Narayanavanam Sri Kalyana Venkateswara swami Brahmotsavam
20. Sri Nrusimha Jayanthi, Tarigonda Vengamamba Jayanthi
21. Annamacharya Jayanthi, Kurma Jayanthi
31. Hanuma Jayanthi

### JUNE

6. Buddha Jayanthi
13. Sri G.T. Pushpayagam
17 to 19. SRIVARI Jyestabhishekam
15 to 23. Appalayagunta Sri Prasanna Venkateswara swami Brahmotsavam
15 to 19. Sri Padmavati Devi Float Festival
25 to 27. Tiruchanur Sundararajaswami Avatarotsavam



## JULY 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| | | | | 1 | 2 | 3 |
| 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 |
| 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 |
| 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 |

## AUGUST 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
| 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 |
| 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 |
| 29 | 30 | 31 | | | | |

## SEPTEMBER 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| | | | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | | |

### JULY

8 to 10. Srinivasa Mangapuram Sakshatkara Vaibhavotsavam
10. Sri G.T. Pushpayagam
15 to 17. Sri G.T. Jyestabhishekam
16. Anivara Asthanam, Dakshinayanam Begins
16 to 18 Tirupati Sri Kapileswara swami Pavithrotsavam
19. Vyasa Purnima

### AUGUST

5. Andal Tiruvadippuram Sathumora
7. Garuda Panchami
12. Krishna River Pushkaram Begins, Varalakshmi Vratham
13 to 16. SRIVARI Pavithrotsavam
15. Independence Day
18. Jandhyala Purnima,Vikhanasa Jayanthi, Hayagreeva Jayanthi
19. Gayathri Japam
25. Gokulashtami

### SEPTEMBER

3. Sri Balarama Jayanthi
4. Sri Varaha Jayanthi
5. Vinayaka Chaturthi
6. Rishi Panchami
13. Vamana Jayanthi
12 to 14 Sri G.T. Pavithrotsavam
14 to 17. Sri Padmavathi Devi Pavithrotsavam
15. Ananta Padmanabha Vratham
19. Undralla Tadde
30. Mahalaya Amavasya



## OCTOBER 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| | | | | | 1 | 2 |
| 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 |
| 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 |
| 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
| 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 |
| 31 | | | | | | |

## NOVEMBER 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 |
| 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 |
| 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 |
| 28 | 29 | 30 | | | | |

## DECEMBER 2016

CHANT GOVINDA...GOVINDA..

| MONDAY | TUESDAY | WEDNESDAY | THURSDAY | FRIDAY | SATURDAY | SUNDAY |
|---|---|---|---|---|---|---|
| | | | 1 | 2 | 3 | 4 |
| 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 |
| 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 |
| 26 | 27 | 28 | 29 | 30 | 31 | |

### OCTOBER

1 to 11. Sri Padmavati Devi Navaratri Utsavam
2. Gandhi Jayanthi
3 to 11 SRIVARI Brahmotsavam
7. Saraswathi Puja, *Srivari Garuda Seva*
9. Durgastami, 10. Maharnavami
11. Vijayadasami
25 to 28. Srinivasamangapuram Sri Kalyanavenkateswara swami Pavithrotsavam
29. Naraka Chaturdasi
30. Deepavali, Sri Kedara Gowrivratam

### NOVEMBER

3. Nagula Chaturthi
7. SRIVARI Pushpayagam
14. Kartika Purnima, Sri Kapileswaraswami (K.T) Annabhishekam Rudrapadala Mukkoti
18. Sri K.T. Laksha Bilvarchana
26. Sri Padmavati Devi Brahmotsavam Begins
30. Gaja Vahanam
27. Dhanvantari Jayanthi
28. Sri K.T. Kartika Somavarabhishekam

### DECEMBER

4. Sri Padmavati Devi Brahmotsavam Ends Panchami Theertham
5. Sri Padmavati Devi Pushpayagam and Subrahmanya Shashti
10. Gita Jayanthi
11. Chakra Theertha Mukkoti
13. Sri Datta Jayanthi
15. Dhanurmasam Begins at 8-55 p.m.





16

నందగోపస్వామి మందిర రక్షకా!
సుందరధ్వజ తోరణ ద్వారపాలకా!
వల్ల కాదనకు! వలదనకు మునుమున్నె,
అల్లన రతనాలతలుపుగొళ్లెము తీయ ॥వల్లవి॥

కల్లకపటములేని గొల్ల కన్నెల మన్న!
నల్లని తిరుమేని వానికై వచ్చేము ॥వల్లవి॥

మ్రోయు పరవాద్య మిడెదనని నిన్ననే
మాయలాడు తానే మాట యిచ్చేనని
ఈయెడ తానమాడి ఏతెంచినా మన్న!
తీయుమా తలుపు! పాడేము మేల్కొలుపు! ॥వల్లవి॥



సిరినోము







17

మేలుకో! మేలుకో!

చాలించి నీ నిదుర - మేలుకో!

ఏ లేవడి రానీక, ఎల వేళ లరసే మా

ఏలికా! నందగోపాలకా! మేలుకో! చాలించి నీ నిదుర

తల్లీ! వ్రజవల్లీ నవ పల్లవాభిరామా!

అల్లన లేవమ్మ! యశోదమ్మ! నందగృహదీపమ!

॥మేలుకో॥

భువిని దివిని మీరి భువన భునవముల నిండే

త్రివిక్రమా! పురుషోత్తమ! దేవ దేవ! శ్రీకృష్ణా!

॥మేలుకో॥

ఆలించి మనవి మా మేలెంచి ఏలుకో!

కనకవీర మంజీరము ఘనపదముల తొడవుగా

తనరే బలదేవా! నీ తమ్మునితో మేలుకో!

ఆలించి మనవి మా మేలెంచి ఏలుకో!



సిరినోము







18

నందగోపుని కోడలా! ఓ నీల!
ఎందుకమ్మా తలుపు తీయవు?
విందువా కోళ్ళు కూసేను, ఆవంక గురి
వింద పొదలందు పలికేను గోరింక! ॥నంద॥

కందుకము వ్రేళ్ల సందిటను కలదాన!
అందమగు కురుల నెత్తాని కల లలన!
కుందనపు కంకణాల్ చిందులాడీ పొడ
కెందమ్మి పోలేటి నీ సోగ కేల ॥నంద॥

సుందరుడు నీ స్వామి శుభనామములను మన
మందరమునూ కూడ పాడుకొందాము!
క్రందుకొను గంధసింధురబలముతో, వైరి
బృందముల క్రిందపడజేయగలిగే వాని ॥నంద॥



సిరినోము







19

పలుకవా నళినేక్షణా!
బదులైన
పలుకవా నవమోహనా!
పలుకవా రవ్వంత? పవ్వళింతువు గాని
కలికి చనుగవపైని తలగడగ కేలూని ॥పలుకవా॥

తళుకు దంతపుకోళ్ళ మంచమ్ముపై,
లలిత సురభిళ పంచతల్పమ్ముపై,
ఒరిగి కప్పర దివ్వె వెలుగులో, అల నీల
నెరుల విరితావిలో, నిదురింతువేగాని ॥పలుకవా॥

గడెయైన వల్లభుని ఎడబాయవు;
తడవైనగాని నిద్దుర లేపవు;
సొగసు కాటుక రేక సోగకన్నుల దాన!
తగదమ్మ నీ వంటి సుగుణవతి కో చాన! ॥పలుకవా॥



సిరినోము







20

మేలుకో శ్రీకృష్ణ! మేలుకొనవేమీ!
చాలుబడి గల దేవ! మే లొసగు స్వామీ!

మున్నేగిముప్పదియు మూడుకోటుల సురల
బన్నముల బాపు బలశాలి! వనమాలీ!
వెన్నుదవిలి విరోధివితతికి వనట గూర్చి
చెన్ను తొలగించు ఆపన్న జనతావనా! ॥మేలుకో॥

మేలుకో ఓ సిరీ! శాతోదరీ!
మేలుకో ఓ నీల! పరిపూర్ణురాలా!

మేలుకో నవకిసలయాధరా!
కలశోపమపయోధరా! ॥మేలుకో॥

ఆలవట్టము అద్ద మొసగి నీ స్వామిని
ఆలసింపక పంపవమ్మ నీరాడ! ॥మేలుకో॥



సిరినోము







## 21

బంగరు కడవలనిండా పాలు
పొంగి పొరల కురిపించే ఆలు
చాల కలుగు నందుని గారాల నందనా!
మునిహృదయ స్యందనా!

వైకుంఠము విడిచి, లోక
లోకమ్ములు కడచి,
మా కోసము దిగివచ్చిన మా స్వామీ! మేలుకో!
మేలుకో తేజోమయ! నీలాప్రియ! మేలుకో!
మేలుకో భక్తాశ్రితపాళీ నరసిజహేళీ!

వైరులు నీ శౌర్యమ్మున కోడి,
సైరింపక, నీ వాకిట కూడి,
బీర మేది శ్రీపదముల
వారక కొలిచే తీరున,
చేరి మంగళాశాసన
మును చేసి, ముదమ్మున కై
వారమ్ములు చేసి, వచ్చి
నార మయ్య, నిదురమాని మేలుకో!



# సిరినోము







22

ఏదీ ఏదీ! నీదయావీక్షణము ఏదీ ఏదీ!
ఇంచించుక పరపుము మాపై, మాపై!
చిరుగజ్జెల వలె విరిసే ఎరనెర్రని తామరల
తెరగున వికసించే ఆ కెంజాయ కందోయి! ॥ఏదీ॥

అందమగు ఈ లోకమందలి ఏలికలు
అందరును మానాభిమానములు వీడి
సుందరము నీ గద్దె క్రింద బృందములైన
చందమున, నిలుచు మా డెందములు చల్లబడ! ॥ఏదీ॥

ఒక్క కనుకొస చూపె చాలును, చాలును -
పాపముల పరిమార్చను!
ఒక్క కనుకొన ప్రాపె చాలును, చాలును -
తాపముల చల్లార్చను! ॥ఏదీ॥



సిరినోము







## 23

తరలిరాగదే, దేవ! దయచేయగదే!
దరిసింపగ వచ్చిన మా పని విని పాలింతుగాని!
తరలి రాగదే!

వానకారులోన సింహ మొకడు మేల్కాంచి, పొడవు
మేను సారించి, ధూళి తూలించి, కెంపుకనుల
మానుగ వీక్షించి, పరీమళ భర సటలూగ, గహ్వ
రాననుండి వెలువడు చందాన మందిరమునుండి
తరలి రాగదే!

భాసుర బహురత్న ఘటిత భర్మ సింహ పీఠికా
ధ్యాసివై, అనుగ్రహోల్లాసివైన స్వామీ! అత
సీసుమ కోమల శ్యామమోహను, లోకావను, నిను
చూసి చూసి, మనసు వెళ్ళబోసి, కృతార్థలము కాగ -
తరలి రాగదే!



సిరినోము







**24**

మంగళమని పాడ వస్తిమి,
మరిమరి నీ మగటిమికి -
మంగళమని!
ముంగిట నిలబడిన మా కొ
సంగుదువని పరవాద్యము
॥మంగళ॥

అల్లనాడు లోకమ్ముల
అలవోకగ కొలిచిన నీ
పల్లవారుణ శ్రీపద
పద్మములకు మంగళమని,

పెల్లుగ నీ వెత్తి వెడలి
సుందర లంకాద్వీపము
తల్లడబడ మాసిన నీ
దర్పమునకు మంగళం -
॥మంగళ॥

కాలదన్ని ఒక త్రుటిలో
కరకు శకట దైత్యుని
నేల రాలు నటు చేసిన
నీ కీర్తికి మంగళమని,

కూళను వత్సాసురు నవ
లీలగ చిరుకోలవోలె
తూలవిసురు దుడుకు అడుగు
దోయికినీ మంగళం!
॥మంగళ॥

దండిగ గోకులమునకై
దలదాలిచి గొడుగువోలె
కొండ నెత్తివేసిన నీ
గుణమునకును మంగళమని,
భండనమున నొక వ్రేటున
పగతుర పీచ మ్మడంచి
చెండాడిన నీ చేతి ప్ర
చండాసికి మంగళం!
॥మంగళ॥



# సిరినోము







25

అర్థులము, అనుగులము,
అంజలింప వచ్చినాము!
అడిగిన వర మిడుదు వని,
అనురాగపు గని వని!

ఒక అమ కొమరుడవై, వే
రొక అమ ఒడిలో దాగి,
ఒదిగిన నిను హింసింపగ
ఊహించిన కంసునకు
అసురునకు కడుపుమంటవు!
అర్థుల కమృతాల పంటవు! ॥అర్థులము॥

సిరికూడా వలచే నీ
దొరతనమూ, దోర్వీర్యము
పరవశమున పాడి పాడి
విరహ మెల్ల మరతుము!
పరవాద్యము కరుణింపుము
పరమానంద మొసంగుము! ॥అర్థులము॥



సిరినోము







## 26

అవధరింతువా! అనుగ్రహింతువా!
ఆశ్రితజనవత్సలా! నీ వవధరింతువా?
మార్గశిర స్నానమునకు మా నోమునకు
మాకు వలయు వానిని మహేంద్రమణి ప్రభామూర్తి!
॥అవధరింతువా॥

క్ష్మామండల మదరిపడగ శబ్దించేవీ,
పాలవన్నె నొప్పారెడు పాంచజన్య మట్టినీ,
శంఖములూ, ప్రబల బహుళ
పటహములూ పరవాద్యము - లను గ్రహింతువా!
॥అవధరింతువా॥

మంగళ మణి దీపికల,
భృంగారువు, చందువాల,
బంగారపు పళ్లెరాల,
రంగు రంగు ధ్వజపటాల,
పొంగుచు మంగళాశాస
నము పాడే గాయకుల ॥అవధరింతువా!॥

ఓ వటపత్రశాయీ! వరదాయీ! వరదాయీ!



సిరినోము







27

వేడవచ్చునా మరికొన్ని, మా
వేడుకకై కొన్ని,
కూడనివారిని ఓడించే శుభ
గుణములు గల గోవిందా!

ఆడువారి కోరిక లనుకోకు!
కూడదనకు గోవిందా!నీ
రాడి వచ్చి వ్రత మూనిన ముదమున
అడిగెద మంతే స్వామీ!

సూడిగములు, జుమికీలు, చెవాకులు,
పాడగములు, కేయూరములు,
తొడవులన్ని కయి సేయగ వలదో!
తొడగవలదొ పలువన్నెల వలువలు! ॥వేడ॥

ఇంతకన్న శుభవేళ ఏదీ?
ఇంతకన్న ఆనంద మేదీ?
బంతులుగా నీతోడ గూడి
ఇంతుల మెల్లరము

నేయి వెన్న మీగడలు
తీయని తీయని పాయసము
చేయి మునుగగా ఆరగింపగా
చేయవా! చిత్తగింపవా! ॥వేడ॥



సిరినోము







## 28

చీకాకు పడకు - చిడిముడి పడకు -
నీ కరుణ వినా మా కేమున్నది చెప్పు!

మా పున్నెము వలనగదా,
మా కోసమెగాదా, మా
గోపకులములో దిగి
గోవిందుడ వైనావు! ॥చీకాకు॥

గోవుల వెంబడి ఏవో
కోనల కానలలో, బడి
పోవు నట్టి వెర్రిగొల్ల
పొలతులము!

చిన్ని పేర పిలిచాము! ఎన్నో మాట లన్నాము!
ఎన్ని జన్మములదో ఈ వీడని మనబంధము!
ఇక దయచేయుము వరము పరవాద్యము! ॥చీకాకు॥



సిరినోము







29

ఒకటే కోరిక మా కిక
ఓ స్వామీ! గోవిందా!
మనసు నీకు తెలియదనా! (మా)
మనవి చేసుకొనుట! (ఈ)

తెలవారక మున్నే, దేవా, నీ సన్నిధి
చెలులము చేరి, నీ కొలువే కోరి,
సరస సుందరములు
సంపుల్ల సరోజములు నీ
చరణములకు మంగళా
శాసనమును చేయుట
ఒక పరవాద్యమున కనా?
ఓ స్వామీ గోవిందా! ॥ఒకటే॥

ఆల మేపి బ్రతికే ఈ
బేలలలో ఒకడవై
అవతరించు టేల? మా
అనుగపు కానేల?
ఈ బంధము నిలుపుము ఏ
డేడు జన్మముల కైన!
ఈ కైంకర్యము మానము
ఏనాటికి ఎప్పటికీ! ॥ఒకటే॥



సిరినోము







## 30

శుభమగుగాత! సుఖ మగుగాత!
ఉభయ విభూతి నాయకుడౌ శ్రీ
విభుని, ప్రపన్న సులభుని దయచేత!
విలిపుత్తూరున వెలయు భట్ట నా
థుల కూతురు ముప్పదులు తమిళ కృతు
లలరుమాలగా నల్లె - అన్నిటిని
ఎలమి తవిలి పఠియించిన వారికి
శుభ మగుగాత! సుఖ మగుగాత!

నావలుగల వనధిని మథియించిన
శ్రీ వల్లభుని కేశవుని దరిసిన
ఆ విధువదనలు దివ్యాభరణలు
ఏ విధి వ్రత మూని ఏ వర మందిరో
ఎరిగిన వారికి ఇహపరములలో
శుభ మగుగాత! సుఖ మగుగాత!

కలిత పద్మాక్ష శిశిర మాలికా
విలసితుడౌ శ్రీ పెరియాళ్వారుల
తులసి మొలక, శూడి కొడుత నాంచారు
సెలవిచ్చిన ఈ తిరుప్పావై
ఎలమి తవిలి పఠియించినవారికి
శుభ మగుగాత! సుఖ మగుగాత!

గిరుల వంటి నాలుగు పెనుభుజములు,
అరుణనేత్రములు, శ్రీ ముఖమును గల
ఉభయ విభూతి నాయకుడౌ శ్రీ
విభుని ప్రపన్న సులభుని దయచేత ॥శుభము॥



# సిరినోము






డా॥ చిన్నలక్ష్మి ౹ కళావతి, 99633 39301

**గోదాపాశురాలలో వర్షాకాల ప్రాధాన్యత ఎటువంటిది?**

*– గోపాల్, కందూరు.*

వర్షాకాలానికి ఈ పాశురాలలో చాలా ప్రాధాన్యత కల్పించబడింది. ఈ కాలం ఒక్కొక్కరికి ఒక్కొక్కవిధమైన ప్రాధాన్యత కలిగి ఉంటుంది.



యోగులు ఈ వర్షాకాంలో చాతుర్మాసదీక్షపూని సర్వదా భగవద్ధ్యానంలో నిమగ్నులై ఉంటారు. ఆధ్యాత్మిక ప్రచారంకోసం తిరుగుతూ, ఒక్కొక్క గ్రామంలో ఒక్కరాత్రి కంటే ఎక్కువ ఉండని సన్యాసులు ఒకే స్థలంలో స్థిరంగా ఉండి, దీక్షను నిర్వహిస్తూంటారు. రాజులు తమ తమ విరోధాలు మరచి, యుద్ధసన్నాహాలు చేయక, రాజ్యంలోనే ఉండి, సాంసారికభోగాలు అనుభవిస్తుంటారు.

కవులు రమణీయప్రకృతిని చూచి, ప్రేరణపొంది, కవిత లల్లుతారు. మహాకవికాళిదాసు మేఘసందేశం సుప్రసిద్ధం కదా! కృషీవలులు వ్యవసాయకార్యాలలో లగ్నమౌతారు.

సంసారులు వర్షాకాలంలో, శ్రమించక, ముందే అన్నీ సమకూర్చుకొని ఉన్న వస్తుసామగ్రితో సుఖజీవనం గడుపు తుంటారు.

నాలుగునెలల వర్షాకాలంలో సుఖపడదానికి మిగిలిన ఎనిమిదినెలలు కష్టపడాల్సి ఉంటుంది.

వృద్ధాప్యంలో సుఖపడ్డంకోసంకై వయస్సులో ఉన్నపుడే కష్టపడాలి కదా!

పరలోకంలో సుఖపడ్డంకోసం ఇహలోకంలో ప్రయత్నిస్తూ కష్టపడాలి. వర్షాకాలంలో సింహాలు మృగయా విహారం మాని, గుహలలో నిద్రిస్తుంటాయి.

ధీరోదాత్తుడైన శ్రీరామచంద్రుడుకూడ వర్షాకాలంలో సీతావియోగాన్ని సహించలేక – అత్యంతక్లేశమందినట్లు రామాయణంలో వర్ణితం. క్షణ మొకయుగంగా రాముడిట్లు గడుపుతుంటే, తారా, రమలను కూడి సుగ్రీవుడు యుగ మొగక్షణముగ గడుపుతూ – రామునికి తాను చేసిన వాగ్దానాన్ని కూడా మరచి, సీతావియోగశోకమందున్న రామునికి చాలాకోపం తెప్పించాడు.

ఈ విధంగా వర్షాకాలం వివిధరకాలైన ప్రభావాలు కలిగి ఉంటుంది.




నమ్మాళ్వారుమొర విని, ఆ భగవంతుడు "అజ్ఞాన తిమిరం- పాపతిమిరం" నశించేటట్లు జ్యోతిగా కన్పించి, తన స్వరూపాన్ని చూపిందే - "పరమసుందరా! పద్మాక్షా! సాటిలేని కాటుకవలే నల్లనైనశరీరం కలవాడా! భూత భవిష్య ద్వర్తమాన కాలాలకు నిర్వాహకుడా! నిన్ను ఏ రోజు తెలుసు కొనేది?" - అని తాపత్రయపడుతూ ఉన్న నా హృదయం-

'సకలశాస్త్రాలవలే ఉన్నవాడు-షణ్మతాలరూపంలో ఉన్న వాడు- సుస్థిరంగా ఉన్నవాడు- సమస్తవస్తువులకు అంతరాత్మ అయినవాడు- దేవతల కందరికీ కారణభూతమైనవాడు- అన్నింటికీ ఆదియైనవాడు ఐన నా స్వామిని- కృష్ణణ్ణి దర్శిం చాను" అని పరమానందాన్ని పొందిందంటున్నారు-నమ్మాళ్వార్లు.

అన్నింటినీ పరిత్యజించి, మహానుభావుడు నమ్మాళ్వార్లు పొందిన ఆ మహోన్నతస్థానం ఆయనకు సులభంగా కడపట దొరికిందని తోస్తుంది - మనకు. ఆ అయోమయస్థితిలో నమ్మాళ్వార్లు ఎన్నోమెట్లు దాటిపోతున్నారు. సూక్ష్మ-అతిసూక్ష్మ-సూక్ష్మాతి సూక్ష్మఅనుభవాలకు అంతే లేదని తోస్తుంది- నమ్మాళ్వార్ల పాశురాలు చదివి చదివి ఆనందించినప్పుడు!!

నమ్మాళ్వార్లతత్త్వాలలో రెండు ముఖ్యాంశాలున్నాయి. ఒకటి ఆత్మజ్ఞానం; రెండోది భక్తిఅనుభవం. చింతనకు ఆహారం వేదాంతం; హృదయానికి ఆహారం భక్తి. మనలో ఒకరుగా ఉండి - మనకు వీటిల్ని ఉపదేశిస్తూ - నమ్మాళ్వార్లు ఉన్నట్లుండి మనల్ని వదలి- చాలా దూరంపోయి- ఎక్కడో ఒక మహో న్నతపర్వతాన్ని ఎక్కి, ఏదో ఉపదేశిస్తారు. "ఇదిగో చూడండి!" అని తాము ఎక్కిన ఆ పర్వతశిఖరాన్ని-ఈ కండ్లతోనైనా చూడలేక పోతున్నాం. చూస్తే కండ్లు తిరుగుతాయని భయపడుతున్నాం. అది గమనించి, నమ్మాళ్వార్లే మన అంతస్తుకు దిగి వచ్చి, పొరపొచ్చాలు లేకుండా మనహృదయాల్లో కలిసి తిరిగి, ఏదో ఉపదేశిస్తున్నారు - వినండి - "ఇదిగో నమ్మండి- భక్తివల్ల అందరికీ మోక్షం ఉంది" అని.

ఆ తత్త్వశిఖరంలో నుంచే - భగవద్విశ్వాసం, మతం అనేవి- పర్వతశిఖరంలో నుండి గంగానది పుట్టినట్టు పుట్టు తున్నాయి. ఆ గంగానది ఈ భూమిపై ప్రవహించి, తాను ప్రవహించినంతదూరం-కనుచూపుమేరకు అందినంతదూరం పండిస్తుంది. అదేవిధంగా ఈ తత్త్వశిఖరంలో పుట్టిన భగవద్వి శ్వాసం కోట్లకొద్దీజీవుల్ని పుణ్యవంతులుగా చేస్తోంది. గంగానది ఒక ఉత్తరభారతదేశానికే అయితే భగవద్విశ్వాసం ఈ ప్రపంచంలోని ప్రతిజీవాణువునుకూడా పునీతం చేస్తుంది. ఈ ప్రాకృతప్రపంచంలో భక్తి - విశ్వాసం - మతం అనే మూడూ పురిగొని, ఏకమై ప్రపంచానికంతటికీ జీవనదిగా ప్రవహిస్తూ ఉంది. ఈ విషయాలన్నీ అనుభవించి, పాశురాల ద్వారా తెలియ జేసిన నమ్మాళ్వార్లవిశ్వాసాన్ని 'గొప్పవిశ్వాసం' అని చెప్పవచ్చు.

నమ్మాళ్వార్ల విశ్వాసానికి ఆధారమైన భగవదనుభవాన్ని ఒక సముద్రమనే చెప్పాలి. ఈ భగవదనుభవాలనే ప్రబం ధాలుగా వెలువరించి, దేశాన్ని తీర్చిదిద్దాలని ఆ భగవంతుడు పూనుకొన్నాడనీ, ఈ ప్రబంధాలను తమిళప్రపంచంలో ఒకమహాసముద్రంగా భావించాలనీ శ్రీవైష్ణవుల అభిప్రాయం. నమ్మాళ్వార్లు శాస్త్రాలన్నీ తెలుసుకొన్నవారే- అయినా వీరిజ్ఞానం కేవలం శాస్త్రజ్ఞానం కాదు - నిజానికి వీరు చింతచెట్టు కింద



యోగం చేసినవారే! కానీ, అయితే వీరి ఈ సూక్ష్మాతిసూక్ష్మ జ్ఞానం యోగాభ్యాసంతో వచ్చింది కాదు - శాస్త్రజ్ఞానం కన్నా, యోగజ్ఞానం కన్నా ఈయనజ్ఞానం భగవంతుని ప్రసాదంగా దొరికిందని శ్రీవైష్ణవుల విశ్వాసం.

'ఆ భగవంతుడే మాయారూపకవిగా వచ్చి, తన మనసులోను, తన ప్రాణంలోనూ కలిసి జీర్ణమై, తన్ను నామ మాత్రుడిగా చేసి, తన్ను తానే పాడించుకొన్నాడు' అని నమ్మాళ్వార్లు మాటిమాటికి చెబుతున్నారు. 'ఆ భగవంతుడు తన కన్నులలోను- మనసులోను-భక్తిలోను-మాటలలోను- చేతల లోను- కవిత్వంలోను ఉన్నాడు' అని పలుమార్లు చెబుతూ చెప్పుతూ "నేను భగవంతుని కవిని" అంటున్నారు. ఎటువంటి కవియో చూడండి-



..... ..... ..... తనదే యులగెన నిన్డాన్ తన్నై
నన్ తమిళ్ మాల్కనో కేళేన్ అడియార్కు ఇన్బమారియే!

"లోకమంతా తనదే అనితోచునట్లున్న ఆ సర్వేశ్వరునిపై, భక్తులకు సంతోషం కలిగించేవిధంగా, సత్యమైన పలుకులతో ద్రావిడభాషలో ప్రబంధాలను రూపొందించడానికై జన్మించిన పుణ్యుణ్ణి" అని.

భగవదనుభవం అనే మహాసముద్రంలో నుంచీ నమ్మాళ్వార్లు అనే మేఘం మంచినీరు అనే ప్రేమను మోసుకొని వచ్చి, భాగవతులు అనే పైరుపై వర్షిస్తుందని ఆయనభక్తుల విశ్వాసం.

నమ్మాళ్వార్లకాలంలోనే వీరిపాశురాలు ద్రావిడదేశ మంతా వ్యాపించి, ప్రసిద్ధికెక్కాయని ఊహించవచ్చు. భక్తులు వీరినిగూర్చి పాడేతీరును నేడు గమనిస్తే మన ఊహ సరియైందే నని తెలుస్తుంది. భక్తులుమాత్రమే కాదు వీరిని పొగిడింది-వారు పొగడక పూర్వమే - నమ్మాళ్వార్లే -

పాలేమ్ తమిళర్ యిశై కారర్ పత్తర్ సరవుమ్ ఆయిరత్తిన్
పాలే పట్టవివైపత్తుమ్ వల్లార్మల్లై పరివదే.

"తమిళభాష తెలిసినవాళ్లచేత, భక్తులచేత కొనియాడ బడుతూ పాలవలే ఆస్వాదింపదగిన వెయ్యిపాశురాలలో - ఈ పది పాశురాలను అభ్యసించినవాళ్లకు క్లేశం లేదు" అంటున్నారు.

నమ్మాళ్వార్లపాశురాలు మధురకవులు మొదలైన ఆ కాలంలోని భక్తులకు సంతోషాన్ని నింపేవి. అంతేకాదు - ఆ తర్వాతిభక్తులైన నాథముని మొదలైన ఆచార్యాదులకు జ్ఞాన ప్రవాహంగా తయారయ్యాయి. అవును, నిజమే! వీరి పాశురాలు, అందులోని ఉపదేశాలు ఆ కాలంవారికే కాదు - ఈ కాలం వారికికూడా మతం, భగవంతుడు- వీటియందు ఆసక్తి కలవారికిమాత్రం జ్ఞానప్రవాహంగానే కన్పిస్తాయి. నమ్మాళ్వార్లు తమ ఇష్టదైవాన్ని "జ్ఞానప్రవాహకాంతిదీపం" అనే పొగుడుతున్నారు. ఈ కాంతిదీపంవల్ల ప్రకాశిస్తున్న జీవితంమాటలు - ఒకే జ్ఞానప్రవాహంగా తోచడంలో ఆశ్చర్యం లేదు.

*(ముగింపు వచ్చే సంచికలో...)*

